# గోలకొండపత్రిక

చిత్రభాను సం॥ర చైత్ర బ॥ ౯ గురువారము


# సంస్థానాల భావిస్థానము

సర్ క్రిప్సుగారు తెచ్చిన బ్రిటిషుమంత్రి వర్గప్రసాదములో భారత దేశమందుండు సంస్థానముల స్థానమును గురించి గత సంచికలో సూచించినాము. దానినిగురించి మరికొంత విపులముగా తెలుసుకొనవలెను. హిందూస్థానములో ౫౬౦ చిల్లర దేశీసంస్థానములు మూడవభాగపు వైశాల్యమును ఆక్రమించుకొన్నవి. జనసంఖ్య మొత్తము హిందూస్థానములోని జనసంఖ్యలో నాల్గవభాగమై యున్నది. ఇంతటి గొప్పవైశాల్యములోని ఇంచుమించు౯కోట్లజనుల ముందుగతి యేమిఅని విచారించుట ముఖ్యవిషయము. క్రిప్సుగారు తెచ్చిన రాజ్యాంగమును ఒప్పుకుంటే ముందుకాలములో "పాకిస్థాన్", "హిందూస్థాన్" "రాజస్థాన్" అను మూడువిభాగములుండును. పాకిస్థాన్ ముచ్చటయే హిందూ సిక్కులకు భయంకరముగా ఉంటే ఇక రాజస్థాన్ విషయమెట్లుండునోయేమో?

ముందు రాజ్యాంగములో క్రిప్సుగారి సూచనలప్రకారము మన దేశీసంస్థానాలు ఇష్టముంటే చేరవచ్చును. లేకపోతే చేరుటకు నిరాకరించవచ్చును- నిరాకరించి వస్తైతే వాటిగతి యేమగును? దానినిగురించి క్రిప్సుగారిట్లు చెప్పినారు.

"యూనియన్‌లో (అనగా రానున్న భారతసమిష్టిప్రభుత్వములో) ఏదేని సంస్థానం చేరనిచో అది ప్యారమౌంట్ పవర్ (బ్రిటిషు సామ్రాజ్య శక్తి)నుండి వేరై వదగదు. చేరకపోయినట్లయితే యథాప్రకారముగా ఉండును- అప్పుడు బ్రిటిషువారి సైన్యాలు హిందూస్థానమునకు బయటనో లేక కొన్ని సంస్థానాలతో ఏర్పాటుచేసుకొని వారిరాజ్యాలలోనో వారి రక్షణకై ఉంచబడును."

ఇట్లనుటచేత సంస్థానముల ప్రస్తుతస్థితిలో ఏమిన్ని మార్పు కలుగనేరదు. ఇది సంస్థానప్రభువుల దృష్టిలో యెట్లుండును అనునది రెండవప్రశ్న. గతవారము ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రికలో ఒకవార్త ఇట్లు ప్రకటింపబడినది.

కొందరు సంస్థానాధీశులు సర్ క్రిప్సుతో కలిసి వారనిన్ని ప్రజలకు తృప్తిపరచవలెననిచెప్పినారనిన్ని పైగా భారతదేశమందలి రాజకీయసంస్థలతో సంధిచేసుకొనవలసినదే అనిచెప్పినారనిన్ని అందుపై సంస్థానాధీశులు ఉక్కిరిబిక్కిరియై వైస్రాయిగారితో మొర పెట్టుకొని తమతమసంస్థానముల తత్రాణమే ఢిల్లీకివచ్చి అనోవచెప్పవలెనని తంతులుపంపినారనియు తెలియవచ్చినది.

ఈవార్త నిజముగుచో ఇందు చాలా అంతరార్థమున్నది. దేశీసంస్థాన ప్రభువులు ఇప్పటి విషమస్థితిలో మార్పుకోరరనియు, తమప్రజలతో సంప్రతించతలచుకోలేదనియు, బ్రిటిషిండియాలోని కాంగ్రెసువంటి సంస్థలతో సంబంధమును పసందుచేయరనియు స్పష్టమగుచున్నది.

ఇంకొకపక్షములో ఆలోచించిచూతము. ఒకవేళ దేశీసంస్థానాలవారు భావిభారత యూనియన్‌లో చేరుతామంటే ఎట్లుచేరుదురు. వారు రాజ్యాంగమును చేయబోవు భారతీయశాసన ప్రతినిధుల తోపాటు తమప్రతినిధులను పంపవలెను. తమ ప్రతినిధులనగా ఏమర్థము. తమప్రజలు ఎన్నుకొనిన ప్రతినిధులుకారు. తాము పసందుచేసి తమవశములో తమ కనుకూలముగా మాట్లాడగలరను నమ్మకముగల వ్యక్తులను నామకరణముచేసి పంపుదురన్నమాట. అట్టి నియుక్తులు భారతీయ ప్రతినిధులతో సరిసమానముగు అధికారముకలవారై ఆలోచనసంఘములో చేరుదురు. అయితే ఈసూత్రము అన్ని సంస్థానాల కొకేరీతిగా వర్తించదు. క్రిప్సుగారిట్లన్నారు.

"ఏసంస్థానాలలో ప్రజాప్రతినిధులుకల శాసనసభలున్నవో అట్టిసంస్థానాలనుండి ప్రజాప్రతినిధులు పంపబడుదురు అట్టిఏర్పాటు లేనిచోట ఇప్పటిపద్ధతి వర్తించుచున్నదో అదే యవలంబింపబడును"

అంటే ప్రజాప్రతినిధులుకల శాసనసభలులేని సంస్థానాలలో ప్రభువులే తమ కిష్టమువచ్చినవారిని పంపుదురు. అట్టివ పాపము ప్రజాప్రతినిధి శాసనసభల నేర్పాటుచేసిన మైసూరు తిరువాన్కూరు కొచ్చిన్‌వంటి సంస్థానాధిపతులు నష్టపడుదురు. వారు తమ అభిప్రాయాలు కల వారిని-తమపక్షంగా మాట్లాడేవారినిపంపజాలరు. దూరదృష్టికలిగి ప్రజాప్రతినిధి సభల ప్రసాదించని ప్రభువులు ఆనందింతురు. ఇట్టి ద్వంద్వపద్ధతి సరికానిదై యుండును. బ్రిటిషిండియాకు ప్రజాప్రభుత్వము (డెమాక్రసీ) యిచ్చుచున్న ఇంగ్లీషు డెమాక్రసీప్రభుత్వము ఇట్టి ద్వంద్వపైరుధ్యపద్ధతి నెట్లు పసందుచేసెను. ఫెడరేషను కేంద్రమందు ఏర్పాటు చేయదలచిననాడే సంస్థానాలలో ప్రజాప్రతినిధులు కల శాసనసభలుండవలెనని వైస్రాయిబహద్దరే రెండుమారులు సంస్థానాధిపతులకు బోధించి యుండిరి. ఇప్పుడు అంతకన్నమించిన స్వాతంత్ర్య మిచ్చునాడామాట ఏల అనకపోయిరి?

ఇట్టి సంస్థాన ప్రభునియుక్తులతోకూడా కలిసి కాంగ్రెసువారు ఆలోచనలు చేయదలతురా? కాంగ్రెసువారి పూర్వధోరణినిబట్టి వారు దానికొప్పుకొందురని నమ్మజాలము.

మరిసంస్థానప్రజల అభిప్రాయమేమి? అని యెవ్వరైనా విచారించిరా? సంస్థానాలలో ఉండేవారునూ మనుష్యులే కదా. వారు గొర్రెలుకారని ప్రపంచమెరుగును! అట్టిప్రజల అభిప్రాయాలకు విలువయేమిన్ని లేకపోయెను. సంస్థానప్రజల మహాసభయొకటి కలదు! దాని అధ్యక్షులనైనా క్రిప్సుగారు పిలిపించి విచారించియుండవచ్చును. కాని "సంస్థానప్రజలతో సంబంధములేదు. ఇప్పుడెట్లు వర్తించుచున్నదో ఆపద్ధతినే మేము స్వీకరించుచున్నాము." అని సెలవిచ్చిన క్రిప్సుగారు ప్రజాప్రతినిధులను ఎందుకు పిలుతురు. తమకుతామై డాక్టరు పట్టాభిగారివంటి సంస్థానప్రజానాయకులు వారి దర్శనాన్నికోరితే క్రిప్సుగారు వద్దనలేదు. కన్నీటితుడ్పుగా ఏవో నాలుగుముక్కలు చెప్పిపంపేదానికి వారి కాక్షేపణ యుండదు. అందుచేత "దయచేయుండి మాట్లాడుదాము" అని డాక్టర్ పట్టాభిగారికి చెప్పిపంపిరి. వారితో మాట్లాడను గూడా మాట్లాడిరి. ఫలితమేమి? శూన్యము!

క్రిప్సుగారు వచ్చినతోడనే ఎవ్వరును అనుకొననిసంగతి ఒకటిజరిగినది. కాశ్మీరు మహారాజుగారు భావిభారత యూనియన్‌లో చేరుటకు అంగీకారమును తెలిపిరి. ఆవివరములను ఇదివరకే ప్రకటించియున్నాము. దీని పరిణామము ఇతరసంస్థానాలపై యెట్లుండునోయేమో?

మేము మొదటనే తెలిపినట్లుగా నూరువిధాలా ఇప్పటి ఇంగ్లీషుప్రభుత్వధోరణి ఉండేవరకు దేశీప్రభువులు భావిభారత యూనియనులోచేరరు. చేరకున్నవారు ప్రత్యేక ప్రత్యేక రాష్ట్రాలుగా నిలిచిపోవుదురు. పెద్దపెద్ద సంస్థానాలు గుంపులు గుంపులుగా చేరిపోవును. పెద్దపెద్ద సంస్థానాలు ఇప్పటివలెనే ఉండవచ్చును. వారి రక్షణార్థము బ్రిటిషుసైన్యాలు హాజరుగాఉండును. అప్పుడుభారతదేశములో వివిధ స్వతంత్రరాజ్యాలు అర్థస్వతంత్రరాజ్యాలు, నామకార్థపు స్వతంత్రరాజ్యాలు బహుళముగా ఉండును. ఇట్టి యూనియన్ ఎంతబాగా నడుచునో ఊహించుకొనుటకు వీలులేదు.

---

## మనదాతలు

మన రాష్ట్రములో చాలామంది ధనికులున్నారు. వారిలో చాలామందిదాతలున్నారు. వారిలో సత్పాత్ర దానము చేసేవారే తక్కువగాఉన్నారు. ఈరాష్ట్రములోని తెలంగానాలో అనేక ప్రజాహితసంస్థలు నడుపబడుచున్నవి. అవన్నియు యించుమించు పూర్తిగా ధనికులపైననే ఆధారపడినట్టివవి. రెడ్డిహాస్టలువంటి సంస్థకుదానములుచేసినదాతలు చాలామందికలరు. కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయమును నిలబెట్టిన దాతలును చాలామందికలరు. గద్వాలలో అవిజ పుల్లయ్యగారు అనేకవేల దానముచేసిరి. నల్లగొండలో దోమలపల్లి యాదగిరిరావు సోదరులునుఒకగొప్ప కన్యాపాఠశాలకై భవనముల దానముచేసిరి. ఇట్టిసందర్భములో హైదరాబాదు నగరమందలి వేమనగ్రంథాలయభవనమునుకట్టుటకై తలా 3000 రూ॥ వరకు దానముచేసిన శ్రీలక్కినేపల్లి జానకిరామారావు జాగీర్దారుగారును శ్రీ చుంగి శేషగిరిరావు జాగీర్దారుగారును ఉత్తమదానముచేసి మంచికీర్తిని గడించినవారైరి వీరి సహాయముచేతనే వేమనగ్రంథాలయ భవనము అతిసుందరముగా నిర్మింపబడి స్థానికాంధ్రులకు గర్వింపదగినదిగా ఏర్పడినది. ఈదాతల మాతృభాషాభిమానమునుఎంతకొనియాడినను కొదువకాదు. ఇట్టిసుపుత్రులు తెలంగానాలో బహుళమగుదురు కాక. ఇట్టివారి మూలమున జీవచ్ఛవమగుచున్న మాతృభాషకు అమృతసేచనము కలుగుగాక.

---

## క్రిప్సుగారి సూచనలపై కాంగ్రెసు నిర్ణయము

కాంగ్రెసుకార్యసమితివారు సర్ స్టాఫర్డ్ క్రిప్సుగారి సూచనలనుగురించి ఏప్రిలు ౧౧వ తేది ఉదయపుసమావేశములో ఒకతీర్మానమును ఆమోదించినారు. ఆతీర్మానమును మౌలానా ఆజాదుగారు ఏప్రిలు ౧౧వ తేది సాయంకాలముక్రిప్సుగారికొసగిరి. ఏప్రిలు 3 వ తేది ఉదయపుసమావేశములో కార్యసమితివారు నిర్మాణకార్యక్రమాన్ని గురించి చర్చించిరని ఆజాదుగారు తెల్పిరి. ఆజాదుగారున్ను నెహ్రూగారున్ను కలిసిపోయిక్రిప్సుగారికి కాంగ్రెసుతీర్మానమునందజేసిరి- క్రిప్సుగారు ఏకాంతగాచెప్పినచో వారలు వెంటనే గాంధిగారును కాంగ్రెసు కార్యసమితిసభ్యులను ఉన్నచోటికిపోయిసంగతి తెల్పునట్లు మొదటనిర్ణయింపబడియుండెను- ఉదయమునెహ్రూ, ఆజాదుగారలు క్రిప్సుగారితోమాట్లాడినవెంటనే గాంధిగారున్న చోటికిపోక తమయిండ్లకుపోయినందువల్ల క్రిప్సుగారుమరేమిమాటలు చెప్పలేదని తేలుచున్నది.

కాంగ్రెసు తీర్మానములో భారతీయులు క్రిప్సుగారిసూచనలను అనేకకారణములచే అంగీకరించరాదనిన్యాయబద్ధముగా చెప్పబడుచున్నది- కానితీర్మానమును ప్రకటనచేయ సాయముకనురాలేదని ఆజాదుగారు ఏప్రిలు ౩వ తేదిన చెప్పినారు.

క్రిప్సుగారు ౩వ తేదినఇండియాప్రధానసేనానియగు వేవెల్‌గారితో ౧½గంటలసేపుసంభాషించిరి-

నెహ్రూగారికి చియాంగుకైషేక్ సతిగారినుండి ప్రత్యేకమూలద్వారా ఒకసందేశము పంపబడినది.

కాంగ్రెసు కార్యసమితిలో [illegible] గారి స్థానములో డాక్టరుపట్టాభిగారు [illegible] బడినారు.

---

# క్రిప్సుసూచనలపై వివిధాభిప్రాయములు

### శ్రీఅరవిందఘోష్ గారి ప్రశంస

పుదుచ్చేరిఅరవిందాశ్రమమునుండి శ్రీఅరవిందఘోషుగారు సర్ స్టాఫర్డ్‌క్రిప్సుగారి కీక్రిందివిధముగనొకసందేశమంపిరి.

"మీరుబ్రాడ్‌కాస్టులో చెప్పినదంతయువింటిని-మీరుయిట్టి సూచనలుతెచ్చుటకు తోడ్పడినందుకుసంతోషముగనున్నది- నేనొకప్పుడు జాతీయనాయకుడైయుండి భారతస్వాతంత్ర్యమునకై పనిచేసి యిపుడు రాజకీయరంగమునుండి విరమించి ఆధ్యాత్మికచింతలోనున్నను నేనీఅభిప్రాయమును దెలుపుచున్నాను- భారతదేశము స్వాతంత్ర్యమును,ఐకమత్యమునుబొంది ప్రపంచమున స్వతంత్రదేశములతో సమానస్థానమునాక్రమించుటకు స్వయంనిర్ణయస్వధ్యమునొసంగినట్లు నేనుసంతోషించుచున్నాను-భిన్నభావములను భేదములనుదూరముచేయుటకు నాయకులతో నేర్పడినసదవకాశమును భారతదేశ ముపయోగించుకొనునని ఆశించుచున్నాను-అంతేకాక బ్రిటనుకును ఇండియాకును మిత్రసంబంధమేర్పడుటతో ప్రపంచసంఖ్య యేర్పడునని యు అందుస్వతంత్రభారతదేశము ఆధ్యాత్మికబలముతోమానవజాతి యింకోధిక సుఖజీవితమునను భవించుటకుతోడ్పడగలదనియు నానమ్మకము. ఈదృష్టితోనేనేను నాఉద్దేశ్యమునిట్లుబహిరంగముగ దెల్పుచున్నాను-మీరుచేయుచున్న పనులలోయీప్రకటన కొంతసహాయకారిగనుండునని యు తలంచుచున్నాను."

శ్రీఅరవిందఘోషుగారికి క్రిప్సుగారుకృతజ్ఞతనుదెల్పుచు నీక్రిందిప్రత్యుత్తరమును బంపిరి:- "భారతీయులకందరకును సుపరిచితులగు మీరు బ్రిటిషుసూచనలతో భారతదేశము ఎంతకాలమునుండియో కలవరించిన స్వాతంత్ర్యముసంపూర్ణముగ చేకూరగలదని ప్రకటించుచునొకసందేశమునుపంపి దానినినేను భారతదేశమునకంతకును తెలియజేయుటకవకాశమునిచ్చినందులకు నేనెంతయుకృతజ్ఞుడను."

---

### అమెరికాలోని పత్రికల విమర్శలు

అమెరికాలో ఏప్రిల్ ౫వతేదిన ఈక్రిందివిమర్శలు తెలుపబడినవి:-

న్యూయార్కుటైమ్సుపత్రికయిట్లువ్రాసినది,- జర్మనీజపానుఇటలీదేశాలతో యుద్ధము చేయుటకుభారతీయులువిశ్వాసముంచినతక్షణమేఇండియా స్వతంత్రదేశమగును అమెరికాసంయుక్తరాజ్యముఇండియాకు తమతోపాటుసమానగౌరవ స్థానమునిచ్చును-

ఇండియానుండివచ్చువార్తలకు ఇప్పుడు రణరంగమునుండివచ్చువార్తలకున్నంత ప్రాముఖ్యమున్నది- ఈయుద్ధముతోజయాపజయములు భారతీయులసహకారముపైనే ఆధారపడియున్నవి- ఇండియానుగురించి తమఅభిప్రాయమును తెలుపుటకు అమెరికావారికిహక్కున్నది. ఈ యుద్ధముయొక్కఫలితముఅనుకూలమైనచో ప్రపంచములోప్రజాప్రభుత్వవిధానము స్థిరపడును- ప్రతికూలమైనచో నిరంకుశప్రభుత్వవిధానము స్థిరపడును- ఈయుద్ధములోజయముకలుగుటవల్ల ప్రత్యేకముగా బ్రిటనుకుగాని అమెరికాకుగానిమాత్రమే లాభముకలుగదు- ఈ యుద్ధములో జయము కలుగుటకుఅమెరికావారుతమదేశంలో వసతులు వస్తుసంపద,ధనసంపద,జనసంపద మొదలైనవాటినన్నిటిని పూర్తిగా సిద్ధపరచుచున్నారు. ప్రజాప్రభుత్వముకోరుఅన్నిదేశాలవారును వీరోచితధైర్యముతోను బ్రిటనుమిత్రమండలికి వెంటనేతోడ్పడవలెను- ఈయుద్ధములో బ్రిటను మిత్రమండలికిఅపజయము ప్రజాప్రభుత్వపక్షమువారికిజయముగలిగినయెడల ప్రపంచములో ఏదేశమునకూడాను ఆదేశమువారి పరిపాలనకు లోబడియుండదు- ఇండియాలోతప్పకుండసంపూర్ణస్వపరిపాలనయేర్పడును- "వాషింగ్టను పోస్టుపత్రికయిట్లువ్రాసినది- బ్రిటిషుప్రభుత్వమువారి వాగ్దానములపై భారతనాయకులకు లేశమైనా విశ్వాసములేదని వూహించకలుగుచున్నది- కాబట్టిభారతీయులకు సంతృప్తి కలిగించుటకు బ్రిటిషుమిత్రమండలిలోని యితరదేశాలవారు కొంటనే పూనుకొనవలెను- ఇండియాబ్రిటనుదేశాలకిటువంటిఅపాయస్థితిలోనూడా సామరస్యము కలుగనియెడల బ్రిటనుమిత్రమండలికి జయముకలుగుటకు యిదిఒకగొప్పనిరోధముగా యేర్పడును.-అనివాషింగ్టను నగరములో నాయకులభిప్రాయపడుచున్నారు-బ్రిటనులోని యుద్ధమంత్రివర్గములో యిప్పుడుకొరిగారు ఆస్ట్రేలియా ప్రతినిధిగానున్నారు- యీమంత్రివర్గములో ఒక ఇండియాప్రతినిధికూడానుండునని క్రిప్సుగారు భారతనాయకులకు తెలియజేసినగాని దీనివల్లభారతనాయకులకు సంతృప్తికలుగలేదు. హిందువులుఇటువంటి ప్రమాదస్థితిలో మొండిపట్టుపట్టరాదను ఏప్రెల్ ౫వతేదిన "చిహాగోటైమ్సు" పత్రిక భారతదేశస్థితినిగూర్చి ప్రస్తావించుచు,బ్రిటిష్ ప్రకటిని భారతదేశనాయకులను ఒడంబడికత్వరపడగించవలెనని ఆవశ్యకతను స్పష్టముచేయుచున్నది- భారతీయులలోకొందరు బ్రిటిష్ వదపత్య...లేదరకే బాలకరకంగీకరించిర[illegible]వారని ఎయిర్‌లీ B.—

"భారతీయులుమాటలుచెప్పుచున్నారు జపానునుండుకుపచ్చుచున్నది" అను శీర్షిక క్రింద న్యూయార్కుటైమ్సుపత్రిక సంపాదకీయములో ఈక్రిందివిధముగా వ్రాసినది, -

యుద్ధనిర్వహణములో తమకుగూడ అధికారముండవలెనని భారతీయులుకోర్కె న్యాయమైనదనిచెప్పవచ్చును, భారతదేశపుయూనియనులో చేరకుండుటకురాష్ట్రములకధికార మివ్వరాదని భారతీయులుచెప్పుటఆక్షేపణీయము అమెరికావారు అడ్డుచెప్పరు. ఈవిషయములలో రాజీకిఅవకాశములేదు కాని జపానువారుఫిరంగులతోతమ గుమ్మముచద్దకువచ్చియున్న సమయమున స్వాతంత్ర్యముసాధించుటకుఅవకాశముకలదా యనువిషయమును భారతీయులాలోచించవలెను.

---

### న్యూస్‌క్రానికలుపత్రికకు నెహ్రూగారి తంతివార్త

ఏప్రిలు ౫వతేదిన నెహ్రూగారు "న్యూస్‌క్రానికలు" పత్రికకుఈక్రిందిగా తంతివంపిరి:-

"ఇండియాలోని యువజనులలో సెక్కుటిమెట్టునుదియింకా యుద్ధసంబంధమైన వర్గాలలో చేరియుండలేదు-పిరందయవేళలాసు భారతీయనాయకులు ప్రోత్సాహపరచగలిగినట్లు విదేశీయులు ప్రోత్సాహపరచజాలరు-కనుక భారతీయుదేశ రక్షణశాఖమంత్రిగాపుండవలెను- భారతీయులకు దేశరక్షణశాఖనునప్పగించినఅతడు తనఅధికారమును అనుమర్యాదరూగము చేయుననియు యుద్ధసంబంధనుతోకలిసి పనిచేయదనియు బ్రిటిషుప్రభుత్వమువారు భావించగూడదు.ఇటువంటిఅవిశ్వాసము మువారికి మందటినుండియూడాపున్నది.ఇప్పుడైనను వారువదలిపెట్టవలెను. దేశరక్షణశాఖాధ్యక్షుడు, ప్రధానసేనానియులకి పనిచేయుట దుర్ఘటమైనపనికాదు- ఇప్పుడుకూడ భారతీయమంత్రికి దేశరక్షణశాఖనప్పగించినయెడల ఇండియాలోప్రజలలో అత్యద్భుతమైనఫలితముకలుగును దీనికంగీకరించనిచో యీవిధానమంతయూ విఫలమగును."

### ఎల్. బి. భోపట్కరుగారి ఖండన

అఖిలభారత హిందూమహాసభ కార్యవర్గసభ్యులలోఒకరైన ఎల్-బి-భోపట్కరుగారిట్లు ప్రకటించినారు: "బ్రిటిషుప్రభుత్వమువారు మిత్రభేదతంత్రముతోవిగ్రహతంత్రమును అవిభాజ్యమగు పూర్తిగాతిరస్కరించారు-దేశమునుతెక్కఖండములుగా విభజించుటకేవారి ముఖ్యోద్దేశము-కంటెవారితోవున్న భారతీయులకు మిక్కిలిసంతృప్తికరమైన యీవిధానములవల్లయింతమాత్రము సంతృప్తి కలుగదనిలేను నిర్ధారణగాచెప్పగలను-దీనినిపూర్తిగాతిరస్కరించవలెను-కేవలపూర్తిగైనను నిరాకరించవలెనని క్రిప్సుగారన్నారు-ఇండియాలోఅధికశ స్వపరిపాలనను కృతజ్ఞతవన్న విషయంలో ఇండియానుచీలికలుచీలికలుగాచేయుటకుఅధికమాగాపురికోగవదే విధానము ప్రభుత్వముచారిప్పుడు ప్రకటించారు. దీనివల్లనేరుచేరురాష్ట్రములు వేరువేరుప్రజలవిద్యనవిభాగములువిధిగానేర్పడును బ్రిటిషుమంత్రుల చాతుర్యముపూర్తిగా విఫలమయినది- దీనిభారతీయులందరుకూడా తిరస్కరించవలెను-

### శ్రీసావర్కరు ఉద్బోధము

ఢిల్లీలో ఏప్రెలు ౩వతారీకున నేదుకాంగ్రెస్‌హౌసులో జరిగిన మహాసభయందు అఖిలభారతహిందూ మహాసభాధ్యక్షుడగు శ్రీ వి.డి. సావర్కరుగారు దసయ్యవించుచు హిందూస్థానము హిందువులదేయనుసిద్ధాంతముప్రతిపాదించి సర్ స్టాఫర్డుక్రిప్సుసూచనలు దేశమును చీలికలుగా చేయునవియు. భారతదేశములోప్రజాప్రతినిధి ప్రభుత్వకత్తనివ్వాసించుటకు బ్రిటిషువారికిష్టముపలేదనియు తెలిపినారు తమకుతోచుచున్నదనియూ చెప్పిరి-భారతదేశవిభజనను కొందన్నివిధముల ప్రతిఘటించుతున్నవారనిరి-

సింధునువిభజించుటకుకాంగ్రెసువారు ఓటు చేయుటతప్పు-కాంగ్రెసువారిపద్ధతివలన జిన్నా ప్రోత్సాహముకలిగెను-ఇప్పుడువారు పాకిస్థాను కోరుచున్నారు- పాకిస్థానుకు పంజాబునందలి హిందువులెన్నటికినిఅంగీకరింపరు.దేశముయొక్క ఏకత్వమునురక్షించుటకు హిందూ మహాసభలో చేరియున్న హిందువులుఅవసరమైయేదీనికొనినచ్చుటకు మేముసర్వప్రయత్నములుగావించెదము అని సావర్కరుగారనిరి-

### వి. యస్. శ్రీనివాసశాస్త్రిగారివిమర్శ

బొంబాయిలోఏప్రిలు ౩వతారీకునట్రాంగెక్ గ్రూపుసభలో నుపన్యసించుచు నేడు రైటుఆనరబిల్ వి-ఎస్-శ్రీనివాసశాస్త్రిగారు క్రిప్సుసూచనలనువిమర్శించిరి- శ్రీశాస్త్రిగారిట్లుచెప్పిరి:- తమపరిపాలనములో భారతదేశమునకు ఐకమత్యముకలిగెనని బ్రిటిషువారు చెప్పుచుండిరి- ఆఐకమత్యమునకెన్ని విధములుగ భంగముకలుగ చేయు రాదు-ఆఐకమత్యమును బ్రిటిషువారుతమచేతులతోనే నాశనముచేయుచుండుట అత్యంతశోచనీయము-కాంగ్రెసువారిని ప్రతిఘటించుటకు బ్రిటి

౫వ పేజి చూడుడు

## క్రిప్సుగారిసూచనలు దేశముఖ్యుల అభిప్రాయాలు

హిందూమహాసభ వారినిరాకరణ

అఖిలభారతహిందూమహాసభ కార్యాలోచన సమితివారి చేసిన తెలుపబడిన అభిప్రాయమును సర్ స్టాఫర్డ్ క్రిప్సు గారికిపంపినారు.

"ఇండియాలో ఫెడరేషను లేక యూనియను యేర్పడినప్పుడు బ్రిటిషు ఇండియాలోకొన్ని రాష్ట్రములవారు దానిలో చేరుటకుయిష్టపడనిచో ఆ రాష్ట్రములు దానిలోచేరనక్కరలేదన్న నిర్బంధము ఎంతమాత్రము లేదు" అని క్రిప్సుగారన్నారు. దీనివలన ఇండియాలో చాలాయూనియనులేర్పడును. అనగా ఇండియాలో చీలికలు కలుగును ఇండియాలో చీలికలు కలుగుటకు హిందూమహాసభ వారెంత మాత్రము అంగీకరించరు.

ఇండియాలో ఫెడరేషను యేర్పడి-పిమ్మట ఫెడరేషనునుంచి విడిపోవుటకు ప్రతిరాష్ట్రమునకు హక్కున్నయెడల వేరువేరుసంఘములకు తెగలకు మధ్య వివాదములు కలుగును.

ఇట్లువిడిపోయిన రాష్ట్రములన్నియు కలిసి వేరువేరు ఫెడరేషనుల నేర్పరచవచ్చునని కూడా క్రిప్సు గారుచెప్పిరి దీనివల్లముస్లిములు పాకిస్థానును పరిపాలనను యేర్పరచుటకును, యీపాకిస్థాను ఫెడరేషను వారు ఇండియాకువెలుపలవున్న ఆఫ్ఘనిస్థానుమొదలైన ముస్లిందేశాలతో చేర్చుకుని వెదరించుటకును వారికధికమైన ప్రోత్సాహము కూడకలుగును.

అందువల్లఇండియాలో తప్పకుండా ప్రజాసహాయము లేకుండ ప్రజలలో యెడతెగని ముందు ముందు దేశమునకు ప్రమాదము గావచ్చును చుకొనుటకు కూడ అధికమైనఅవకాశము కలుగును

కనుక ఇండియాకేదీ సాధ్యమైన రాజీయను గాని విభజించుటకు మహాసభవారెంతమాత్రము అంగీకరించజాలరు.

అల్పసంఖ్యాకుల విషయమై క్రిప్సుగారిట్లు చెప్పియున్నారు. జాతులమతములనుబట్టి అల్పసంఖ్యాకసంఘములకు బ్రిటిషుప్రభుత్వము వారిచ్చిన రక్షణలను భారతీయులువారు నెరవేర్చునట్లు బ్రిటిషుప్రభుత్వముకాక నిరిక్ష్యాంగవిధాన నిర్మాణసంఘమువారికిని ఒడంబడిక జరుగగలదు. ఈఒడంబడికను చేయుటనుగురించి తన అభిప్రాయమును తెలుపుటకు ఇండియాలో అన్ని పార్టీలకును హక్కుండవలెను.

ఈ ఒడంబడికతో అన్ని అల్పసంఖ్యాక సంఘాలవారును పూర్తిగాతృప్తిపడవలెను. ఏఅల్పసంఖ్యాకసంఘమువారికైన యీఒడంబడికవల్ల సంతృప్తికలుగనియెడల అసంఘమువారి వివాదములను పరిష్కరించుటకువారితో ఆలోచించి ప్రజాప్రతినిధి పరిషత్తువారొక మధ్యవర్తిసంఘము నేర్పరతురు"

హిందూమహాసభవారు మరేపార్టీకిని అన్యాయము కలిగించరు. అన్నిహక్కులు అన్నిపార్టీలకు సమానముగా నేవుండవలెనని మేముకోరుదుమేగాని యొకప్రత్యేకముగా కొన్నిహక్కులుండవలెనని మేముకోరము.

యుద్ధం ముగిసినతరువాత జరుగబోవు ఏర్పాటులతో మాకిప్పుడేమియుపనిలేదు ఇప్పుడువెంటనే నిజమైనప్రభుత్వాధికారమును బ్రిటిషుప్రభుత్వమువారు భారతప్రజాప్రతినిధులకు వశపరచుట యే ముఖ్యమైనవిషయము.

ఇండియాదేశరక్షణకార్యములను భారతీయులందరును మనఃపూర్వకంగా నెరవేర్చవలెనన్న నిజమైనభారతదేశ ప్రభుత్వాధికారమును వెంటనే ప్రజాప్రతినిధులకు వశపరచవలెను, కేంద్ర ప్రభుత్వమంత్రులకు అన్నిఅధికారములు లభించుటకొరకు ప్రత్యేకముగాక స్వేచ్ఛనుజరుగవలెను. భారతదేశరక్షణవిధానమును సిద్ధపరచవలెను. దేశములో సేనలోచేరుట అర్హులైనవారికందరికిని ఆయుధములనిచ్చి జాతీయమైనికదళము నేర్పరచవలెను.

ఇండియాకు వెంటనే సంపూర్ణస్వాతంత్ర్యము నీయవలెను. ఇండో బ్రిటిషుకామను వెల్తులో బ్రిటను మొదలైన అన్నిదేశాలకు యిప్పుడున్న స్వాతంత్ర్యము మొదలైన అన్నిహక్కులుయిప్పుడే ఇండియాదేశమునకుకూడనీయవలెను.

ఇండియాలోని ప్రజలలో అన్నిపక్షములవారికిన్ని విశ్వసనీయుడైన ఒకనాయకుని వెంటనే జాతీయప్రభుత్వములో దేశరక్షణలో మంత్రిగా నియమించవలెను

ఈమంత్రియే దేశరక్షణపద్ధతిని సిద్ధపరచవలెను. ఇతరదేశరక్షణకు కావలసిన యేర్పాటులన్నిటిని చెయ్యవలెను

"ఇండియాకుతగిన రాజ్యాంగవిధానమును భారత ప్రజాప్రతినిధిపరిషత్తువారే సిద్ధపరచునుపంతవరకు సంతృప్తికరముగావేవున్నది. కాని బ్రిటిషు ప్రభుత్వమువారిదివరకు చేసినసాంఘిక పరిష్కారమూప్రకారమే యీసంఘము ఏర్పడబడునని దీనిలోవున్నది ఇదిచాలాహానికరమైనపద్ధతి మేము చేసినసాంఘిక పరిష్కారము జాతీయతకును, ప్రజాప్రభుత్వవిధానమునకును విరుద్ధమైనది.

మేము సూచించినప్రకారము తగినమార్పులు జరుగవలెను. లేనిచో మేము మీప్రణాళికనామోదించుటకు వీలులేదు. కనుక క్రిప్సుగారిసలహా ప్రకారము మేముదీనినిపూర్తిగా నిరాకరించవలసి వచ్చినది."

## సర్ స్టాఫర్డుక్రిప్సుగారి ఆశాంకురము

ఏప్రిలు..వతేదిన సర్ స్టాఫర్డ్ క్రిప్సుగారు పత్రికలప్రతినిధులతో యిట్లు సంభాషించిరి-

"గతవచ్చేసోమవారము బయలుదేరవలెనను కొంటిని కానిఇంకొకవారమున్నుండెదను-వచ్చేవారముకూడవున్నట్లయితే కొంతముపయోగముండేటట్లు కనిపించుపరిస్థితులుకనిపించినవి. కష్టతరములన్నియుతగ్గిపోయి కొంతమాత్రమున్నందువలనసమ్మానముతో క్లిష్టసమస్యలన్నిటిని పరిష్కరించుకోవచ్చునని సాధ్యముగా చెప్పవచ్చును. నేనుప్రయత్నము చేయవలెననుకొన్నాను. పత్రికలలో యీకష్టాంశములను ప్రకటించగాచూచితిని-అనేకములోప్రజలయింకను రేమియు తెగకముందే యేదోఒకఘోరణిలోపడిపోవుట సహజము-కాని ఈఉదయముపత్రికలలో ప్రకటించినదానినిజూడగా అద్దో చీకటిచెముకగ్గి ఆలోచించుకోపికగానిపించుచున్నది." అనిసర్ స్టాఫర్డుగారనిరి-

ప్రశ్న:-భారతీయుని సైనికశాఖసభ్యునిగ నియమించవచ్చునని వెంటనేఅంగీకరించుటకుమీకుఅధికారములేదా? లేకున్న అటిఅధికారమును బ్రిటిషుప్రభుత్వమునుండి ఒడయుగలరా?

జవాబు:-అవసరమనినాకు తోచినయెడలయుద్ధవర్గముతో యెప్పుడుఅట్టివిషయము సంప్రతించగలను.

ప్రశ్న: ఈసందర్భములో బ్రిటిషు ప్రభుత్వమువడిగితిరా?

జవాబు:- నేనుబ్రిటిషుప్రభుత్వమునకీవిషయము అనుదెలుపుము టిని-కాని వారితో సంప్రతించుటకు నాకుప్రత్యామ్నాయవిధానము గానిఆలోచనగానియేమియునుతోచలేదు. పత్రికలలోకాంగ్రెసువారేమీ సాహసమాధానము పంపెదరని చూచితినిగాని నాకుయేమియునురాలేదు-మస్లింలీగుఅభిప్రాయముగూడ నెన్నాగారింకను తెలుపలేదు-

ప్ర,-హిందూమహాసభయు, సిక్కులును తమ అభిప్రాయములనుచెప్పిరేవాటిమీద మీరు ఆలోచనలనుమార్పుకొనవలసియుండునని తలంచెదరా?

జవాబు:-ఇంకను ఇతరపక్షములేమిచెప్పెనో చూడవలెను. ఇతరపక్షములతో యేదైనసమాధానముకుదిరినయెడల సిక్కుమైనుగూడ మారవచ్చును-

భారతీయునిసైనికశాఖమంత్రిగ నియమించుటకుఅంగీకరించినచో ముగ్గురుపెద్దసోల్జర్లు రాజీనామానిచ్చునట్లుప్రజలకదంతులున్నవని సర్ స్టాఫర్డు క్రిప్సుగారితో ఒకవిలేఖరుడు తెలుపగా "సర్వాబద్ధమనివారుచెప్పిరి-అంతేగాక, సైప్రాంతములోఅనుగావిశ్వాసకష్టముతేర్పడుచున్నదను వదంతిగూడ వారుఖండించిరి-

భారతీయునిసైనికశాఖమంత్రినిగ నియమించి ఆయనసేవలలోచేర్చుకొనుట,రక్షణను ఆయుధధారణము మున్నగువిషయములనిర్ణయింతులఅధికారమునీయవలెననుసూచనచేసినయెడల యీఅంశమునుగురించి పునరాలోచనచేసెదరాయనియడుగగా సర్ స్టాఫర్డుగారిట్లుచెప్పిరి-"సేనియంత్రము నకుప్రత్యేకముగాసమాధానమీయను. కానియేఒక్కవిషయములో నైనమరల ప్రత్యేకముగ పరిష్కారముగలుగునఅవకాశముగాన్పించినయెడలదానిని గురించిఆలోచించుటకు సిద్ధముగనేయున్నాను"

సర్ తేజబహదూరు సాప్రూగారు ర్గమున నిమైనసూచనలనుచేసిరా యనిఅడుగగా యిట్లనిరి-

"నేనుఒక్కటేచెప్పుచున్నాను: రాజకీయాలయందొకవిధముగపరిష్కారముగలుగ గలదని నాకునమ్మకముచేయప్రయత్నించుచుండిరి-- ఈ దశలో నేను కృతజ్ఞుడను"



## ప్రకటన

మహక్మ నిజామత్ అబ్కారీ ముల్కి-వర్కాల్అలీ

రెండవ సిమాహి సన్ ౧౩౫౧ఫ. జాగీరాతు కల్లు అమదని చెక్కులు ఈమహక్మలో క్రింద నుదహరించిన తారీఖులందు ఇవ్వబడును,

మొదటికూర్పు ౫ నుంచి ౯ ఖుర్దాద్ సన్ ౧౩౫౧ఫ. రెండవకూర్పు ౧౫ ఖుర్దాద్ సన్ ౧౩౫౧ మూడవకూర్పు ౧౫ తీరు సన్ ౧౩౫౧ఫ నాల్గవకూర్పు ౧౫ అమర్దాద్ సన్ ౧౩౫౧ఫ.

అందరు జాగీరుదారుసాహెబ్లు మరియు ముస్తాదారుసాహెబులు పైనియమించబడిన తారీఖులలో చెక్కులు తీసుకొనవలయును-

మదద్గార్ నాజిం అబ్కారీ

## క్రిప్సు సూచనపై వివిధాభిప్రాయములు

౪ వ పేజీ తరువాయి

మువారు ప్రత్యేకించుటకు ప్రోత్సహించుచుండిరి. తాము సృష్టించిన పెనుభూతిమును బ్రిటీషు వారు పార ద్రోలలేనిస్థితి వచ్చినది. అయితే ముస్లిము వారును తగాదాలాడుకొనునట్లు చేసినవారికి సఖ్యము కుదుర్చుటకు ప్రభుత్వమునకును అసహ్యభావముతో చూడవలసి యున్నది.

మహాప్రపంచయుద్ధములో దక్కనగారి రాష్ట్రములు భారతదేశయూనియనులో చేరకుండునట్లుగా సంగతులు చాలు అపద్రవకరము. యూనియనునుండి యూనియనులో చేరదలచని రాష్ట్రములు లేనేలేకుండుననిచెప్పుటచేత, బ్రిటీషువారు రాజ్యాంగములో చేరదలచని రాష్ట్రములకు సహాయ మిచ్చుటమాత్రమే గాక, ప్రోత్సాహము కలిగించు చున్నారనిమాడ చెప్పవచ్చును. భారతదేశముఏకముగానుండవలెనని ప్రజలుతలంచుచున్నారు. బ్రిటీషు పరిపాలనలో యూనిటీమును సంపాదించునట్లు చేయుటకుమునుపచ్చినటులనుచుంటిమి. భారతదేశముఏకముగానున్నచోటను, పలుకుబడికలరాజ్యముగా నుండునవి తెలిసి బ్రిటీషువారుయిట్లు చేయుచున్నట్లున్నది. ఇట్టిసందర్భములలో దేశమునకు రాజ్యాంగవిధానమేర్పరచుటతప్ప మొదటచేరనిరాజ్యములు తరువాతచేరుననితలచుటచాలదు. ప్రత్యేకనియోజకవర్గములు తాత్కాలికముగా యుండియు తరువాతఅవి లేనిపోవునవియు చెప్పుటకలవారికాలిలోనుండువలననవిభేదములు వృద్ధియయ్యెను. అవిధముగా క్రిప్సుసూచనవలన ప్రత్యేకత్వము హెచ్చుగా నిలుచును. విడిపోయినతరువాత కలయికలుగుట దుర్ఘటము.

క్రిప్సు గారిసూచనలలో యిప్పుడుమూడింటి విషయమైచర్చజరుగుచున్నది. మొదటిది దేశరక్షణశాఖామంత్రివిషయము. దేశరక్షణ భారతీయులచేతులలోనుండవలెనని వివిధపార్టీలవారును ఒత్తి యుడిచేయుచున్నారు.

రెండవదిసంస్థానములనుమ్మడాదవది భారతయూనియనుతో చేరకుండుటకు రాష్ట్రములకు స్వాతంత్ర్యమొసగుట.

సంస్థానములగాసంస్థానాధిపతులేయనుగొప్ప దురభిప్రాయమిటీవల ప్రబలియున్నది. సంస్థానాధిపతులు నిరంకుశప్రభువులు, ప్రజాప్రతినిధిపభుత్వసిద్ధాంతములు ప్రబలిన ఈరోజులలో సంస్థానములనగా సంస్థానాధిపతులనితలచుట పొరపాటు. సంస్థానప్రజలనుకూడ పరిగణింపవలసియున్నది. భావిభారతరాజ్యాంగవిధానమును నిర్ణయింపదగినవారు సంస్థానాధిపతులప్రతినిధులు మాత్రమేయనియు, సంస్థానప్రజలప్రతినిధులంకారనియుతలచుట పరిపాటికాదు. ఈసమస్యను పరిష్కరించుటకుఅధమాకాదు బినమ్రబ్రిటీషువారు సంస్థానాధిపతులకు, సంస్థానప్రజలకు సంతృప్తికరముగ పరిష్కారముచేయుదురని ఆశించుచున్నాము."

### ముస్లింలీగుఅధ్యక్షునివిమర్శ

అలహాబాదు, ఏప్రెలు 4

నేడుఉదయమున అఖిలభారత ముస్లింలీగు అధ్యక్షుడు జిన్నాగారు ముస్లింలీగు మహాసభలో క్రిప్సుగారి సూచనలనుగురించి ఇంగ్లీషులో ఇట్లు చెప్పిరి.

"ఈసూచనలలో ముస్లిములప్రత్యేకతను ఏకత్వమునుగురించి స్పష్టముగా తెలుపబడలేదు. ఇటువంటిముఖ్యతమమైన సమస్యలనుగురించి ప్రభుత్వమువారు తమఅభిప్రాయమును నిర్ధారణగా తెలుపకపోవుట మిక్కిలిఅనుచితము. రాష్ట్రాలవిభజనము ముఖ్యసమస్యకాదు. బ్రిటీషువారు ఇండియాలోతమపరిపాలనయొక్క సౌకర్యముకొరకు ఈరాష్ట్రములనేర్పరిచిరి. కనుకవీటినిగురించి ఈవిధానములో ప్రభుత్వము ఎక్కువపట్టుదలతో వ్రాయుటకుకారణమేమియుకాదు. "ముస్లిములకు జాతీయ స్వయంనిర్ణయాధికారమున్నది" అని ప్రభుత్వమువారు స్పష్టముగా తెలుపవలెను. ఇండియా ఒక చిన్నఖండముగాని ఒక దేశముకాదు, ఇండియాలో అనేకజాతులున్నవి.

వేరువేరుజాతులకు వైజ్ఞానిక, సాంఘిక, రాజకీయార్థికాది సమస్యలలో మిక్కిలిఅధికమైన భేదాలున్నవి. వాటిని అందరూగుర్తించవలెను.

ఇండియాదేశానికంతటికిని ఒక్కయూనియనుమరేర్పరచుటలో అన్ని రాష్ట్రాలలోనుకూడా హిందువులకే ప్రభుత్వాధికారములభించును. ఈయూనియనునుండివిడిపోవుటకు అల్పసంఖ్యాకసంఘములకు హక్కువుంటుందని దీనిలోవుంది గాని ఈహక్కువల్లయేమియులాభముకలగదు. బెంగాలులోను పంజాబులోను ముస్లిములకు మెజా

రిటీవున్నప్పటికిని యీరెండురాష్ట్రాలలో అల్పసంఖ్యాకసంఘాలుగావున్న హిందువులుసిక్కులు మొదలైనవారు ముస్లిము ప్రభుత్వమువారికి చాలా చిక్కులనుకలుగజేయకమానరు. అందువల్ల చివరకు అన్నిరాష్ట్రాలలోనుకూడా ముస్లిములుహిందువులకు లొంగివుండవలసివచ్చును. ప్రస్తుతములకు కూర్పుము కలుగుటకోసం యీవిధానమును ముస్లిములు అంగీకరించినయెడల యుద్ధానంతరము జరిగే ఏర్పాటులతో ముస్లిముల హక్కులకు మిక్కిలి గొప్పనష్టముకలుగును.

### అకాలీ పంచాంగం

1935వ సం॥పు ఇండియా ప్రభుత్వచట్టమును మార్పకుండా కేంద్రములోను రాష్ట్రాలలోను ప్రజాప్రభుత్వమునకు ఏర్పాటులను చేయవలెనని యీవిధానములోవున్నది. ఈవిషయమునుగూర్చి దీనిలోనిర్ధారణగాయేమీలేదు. గనుకదీనినిగురించి మనమిప్పుడేమీచెప్పజాలము ఈవివరాలనన్నిటిని స్పష్టముగా తెలుపవలెను.

పాకిస్థానుసీనుగురించి మనకిప్పుడు ఆందోళనము చాలాఅధికమయినది ఇదిమనకు ప్రాణాంతకమైనదేకాక ముఖ్యమైనవిషయము. పాకిస్థానును తాముఅంగీకరించినట్లు బ్రిటీషు ప్రభుత్వమువారు వెంటనేమిక్కిలి స్పష్టంగా ఒకప్రకటనచేయవలెను. వెనకటియుద్ధసమయములో అప్పటి బ్రిటీషువారు పాలస్తీనాదేశీయులకు చేసినవాగ్దానములన్నిటిని ఆటుతరువాత వారుపూర్తిగాభంగపరచిరి. ఇప్పుడు యీవాగ్దానములనునమ్మి మనమీయుద్ధములోమనఅర్థప్రాణాలను పూర్తిగాఅర్పించినయెడల యీయుద్ధంముగిసిన పిమ్మట పాలస్తీనావారికి జరిగినఅన్యాయంవంటిఅన్యాయము భారతముస్లిములకుకూడ జరుగుతుందేమోఅని మనము భయపడుచున్నాము.

ఈవిధానములో ఇండియా యూనియనుకే యెక్కువప్రాధాన్యమియ్యబడెను. పాకిస్థాను చాలాకాలంపోతేగాని యేర్పడదన్న సూచనదీనిలోవున్నది. ఈవిధానంలోని పద్ధతులనుసూచనలు, క్రిప్సు గారు తెలుపుతూవున్న విషయములు యివి అన్నీకూడా పాకిస్థానుకు ప్రతికూలంగానేకనబడుచున్నవి. ఈవిధానముగురించి మార్చినెల 27 వ తేదీమొదలు నేటివరకు మన కార్యవర్గంవారు మిక్కిలి శ్రద్ధగా ఆలోచిస్తూవున్నారు. దేశంలో పాకిస్థాను ఏర్పడుటకునూ ముస్లిములకు స్వయంనిర్ణయాధికారము పొందుటకునూ బ్రిటీషుప్రభుత్వమువారున్నూ క్రిప్సుగారున్నూ వెంటనే నిర్ధారణగా తగినయేర్పాటులను చేయుటకొంతమాత్రము వెనుదీయకూడదు. ఈసంభాషణవల్ల చివరకు అన్నిపార్టీలకుకూడా సంతృప్తికరమైనసమాధానం ఏర్పడుతుందని మనముఆశిస్తున్నాము. క్రిప్సుగారేదో నిర్ధారణచేసుకొనే యీయెత్తు అనన్నిటినీ యెత్తుకున్నట్లుతోస్తుంది."

—

## జి. రఘునాథ్ మల్

బ్యాంకరు

ఆబిద్‌రోడు హైదరాబాదు-దక్కను.

అన్నిరకముల బ్యాంకు వ్యవహారములు నరసమగు పద్ధతులతో జరుపబడును.

బ్రాంచీలు:—

కేమ్పుస్టేషను సికింద్రాబాదు.

కరకట్టి హైదరాబాదు

## గాంధిమహాత్మునిమౌనము

క్రొత్తఢిల్లీ, ఏప్రిలు ౪:-

సర్ స్టాఫర్డు క్రిప్సు గారితో నాయకులు సంభాషణగావించినతదనంతరమేర్పడిన స్థితిగతులవిషయమై తమ అభిప్రాయము తెలుపవలసినదని మహాత్ముడు ఢిల్లీనివదలి వెళ్లుచున్నసమయమున వార్తాపత్రికాప్రతినిధులు ఒత్తిడిచేయగా మహాత్ముడిట్లు చెప్పెను:-

మౌనముదాల్చియుండుటవలన నేను నాదేశమునకు ఉత్తమసేవ గావించుచున్నట్లు నమ్ముచున్నాను. నాకోర్కెనిమీరుమన్నించవలెను. మీరుమనాకు సమ్మతియుకునీయ్యమునకే ఈ ప్రశ్నలకు ప్రత్యుత్తరమొసంగ లేకపోయుచున్నాను. అంతియేగాని కేవలము అయిష్టమువల్లగాదు. భారతీయులువినదగినదికలదని నాకు తోచినవెంటనే నాసందేశమును భారతదేశపత్రికల ద్వారా తప్పక తెలుపుదును. నాయొక్క పత్రిక లేనందున నాసందేశమును పత్రికలుప్రచారముచేయవలెననియు నేను కోరుచున్నాను. కాని ప్రస్తుతసమయమున నేను చెప్పదగినదేమియు లేదు.

### అమెరికావారు మంచిప్రచారకులు

అమెరికా ఆంగ్లదేశముల పత్రికాప్రతినిధులతో మాటలాడి దేశస్థులకు అభిప్రాయముచెప్పుటకే దనికొందరనుచున్నారు. కానిస్థితిగతులవిషయమై నేనుయేమైనచెప్పగలిగియుండినచో అమెరికా విలేఖకులు రాకపూర్వమే నేను చెప్పియుండెడివాడను. నేనుప్రచారకుడను, మీవలెనాకు ప్రయోజనము లేదు, నాఅహింసాసందేశము నేను వారికొసంగవలసియున్నది. కనుకవారు నాకుప్రయోజనకారులుగానున్నారు. కనుక వెంటపుచ్చుకొనుచున్నాను.

పత్రికాప్రతినిధులుకొల్లగొట్టవలె పోవుటచేసుమహాత్ముడుమరియునిట్లు చెప్పెను,-

ప్రస్తుతసమయమున మీరు నా సందేశమును ప్రచారముచేయజాలరు. నాసందేశమును నాజీవితములోఆచరించి చూపవలెను. కేవలము బోధించుటవలన ప్రయోజనములేదు. నేను బోధించుసిద్ధాంతములను జీవితములో ఆచరింప ప్రయత్నించుచున్నాను. ఈ సందేశమునుగూర్చి భారతదేశములోమాట్లాడుట సాధ్యముగా యిష్టములేదు. ఇల్లుతగులబడుచున్నపుడు నిప్పునార్పుపద్ధతులపై చర్చజరుపుటవలన ప్రయోజనములేదు. అపద్ధతులను నాజీవితములో నాచరణమునుంచి, నిప్పునార్పుటకు నేనుమాచారిస్తున్నది. నాసందేశమును నేనుఆచరణలోపెట్టువిధముకాగ్రసమితివారికిసమ్మతమో వారికంటెయెక్కువగాసంతోషించువారుండరు. నాకు వారెల్లప్పుడు కృతజ్ఞతయుందును.

ప్రశ్న.-ప్రస్తుతసమయమున బెంగాలుప్రజలు అహింసామార్గము నవలంబింపవలెనని మీరుసలహానిత్తురా?

ప్రత్యుత్తరము,ఒక్కబెంగాలుకు మాత్రమే గాదు. ప్రపంచమంతటిని పత్రికాప్రతినిధులగు మిమ్ములనుపైతము అహింసామార్గమునవలంబింపవలెనని నేను కోరుదును. నాసందేశమెట్టిదైనదని నేననిశ్చయముగావచ్చునీతో నేనుయిది

## ఆజాదు-నావెలుగారల సమావేశము

క్రొత్తఢిల్లీలో ఏప్రెలు౪వతేదీసాయంకాలము ౫-౪౫కు కాంగ్రెసు మహాసభాధ్యక్షుడగు మౌలానాఆజాదుగారు పండిత నెహ్రూగారితో సర్ స్టాఫర్డుక్రిప్సు గారిబసకువెళ్లి అచ్చటినుండి వైస్రాయిభవనమునకుపోయిరి. యాతనిగాచ్చ్యాలయమునకుపోయిరి. మరికొంతకాలములో సర్ స్టాఫర్డు క్రిప్సు గారుకూడ వారితో వెళ్లిరి. క్రిప్సుగారు కాంగ్రెసు నాయకులను సర్వసేనాధిపతి వేవలుగారివి, ముస్లిరీనకచోటవదలిరిరి తమబసకు చేరుకొనిరి. దాదాపుఒకగంటసేపు మాట్లాడి, మౌలానాఆజాదు, పండితజవహర్లాలునెహ్రూగారలు ౬-౪౦కు సర్వసేనాధిపతి కార్యాలయమునుండి బయటికివచ్చి పరాసరివారు స్టాఫర్డుక్రిప్సు గారిబసకు వెళ్లి గ౫నిముషములపాటుమువ్వటించి తమతమబసలకు పోయిరి. ఈచర్చఫలితములు క్రిప్సు గారికేయండనకు తెలుపబడునట.

ఆజాదు-జనరల్ వావెలు గారుసమావేశసమయమున మారీసర్వసేనాధిపతి జనరల్ సర్ అలన్ హార్ట్లీ గారును, జనరల్ హెట్సురత్తగారునుండిరి.

ఆజాదు-వావెలుసంభాషణలసమయమున బ్రిటీషుసూచనలప్రత్యామ్నాయముగా మరికొన్ని సూచనలపైవిచారణ జరిగెననియు, ఈసూచనలపైరక్షణకార్యసమితిసమావేశములో చర్చజరుగునదరకెప్పుడో తెల్లిపోయియుండెడివాడను. ఏడి తములో నాకుఉత్సాహమేయుండెడిది కామ-

ప్రశ్న: యుద్ధపర్యవసానమెట్లుండునని మీయుద్దేశ్యము-

ప్రత్యుత్తరము; శాంతి,తాత్కాలికశాంతిరెండునుపరే యెప్పుడుఈయుద్ధముయొక్క పర్యవసానమైయుండును. (నవ్వు)

### హారిజననిధికి సనూర్పు

సంభాషణలు ముగిసినతరువాత మహాత్ముడు తలవనిత్యంపుగా హారిజననిధికి ద్రవ్యసహాయము చేయవలెననికోరెను. పత్రికాప్రతినిధులు ఉదారముగానోట్లను నాణెములనుఇచ్చిరి. వారిచ్చిన పైకముఒకచిన్నమొత్తమయ్యెను.

అమెరికనువిలేఖకులెక్కడదున్నచోనారు పని రూపాయలనోట్లనిచ్చియుండెడివారని నవ్వుచు మహాత్ముడనెను.

పత్రికఅవిలేఖకునితో మహాత్మునిసంభాషణసమయమునకాంగ్రెసు కార్యసమితి సభ్యులు అక్కడలేకయుండగా మహాత్ముడురాజకీయ, పరిణామములనుగూర్చి మాటలనుతలపెట్టనవి-నాంధీమహాత్ముని భావముసమ "క్రీపెమ్ము జర్నలో" స్పెషల్‌విలేఖరిచేత విస్తాఖ్యానమేదునగా హింసాపద్ధతిలో దేశరక్షణకార్యక్రమహింసక విషయములోరాయబారాలుజరుపుటకు గాంధిమహాత్ముని క్షమలేదట-తనఅహింసనుండిగెన్ని కార్యసమితి ముఖ్యులు చీలిపోవుటయేయని మహాత్ముని విచారకరముగనున్నదట,

నియు తెలియుచున్నది.

సమావేశముముగిసినతర్వాత పత్రికాప్రతినిధులు మౌలానాసాహెబుగారితోకలిసికొని మాటలాడగాయిందునిషయమైప్రకటనగావించుటకు మౌలానాగారునిరాకరించిరి-కానిమీరు ఆశాజనకమైయున్న ప్రశ్నకు ప్రత్యుత్తరమొసంగుచు, ప్రస్తుతసమయమునయుందువిషయమై ఊహాలు చేయకుండుటమేలు-ఆశాజనకముగాని, ఆశలేదనిగానిచెప్పజాలననిరి మౌలానాఆజాదుగారనిరి-

సర్వసేనాధిపతితో జరిగినసంభాషణలను కాంగ్రెసుమహాసభాధ్యక్షుడు సమకేత కాంగ్రెసు కార్యసమితికి విశదించిరి-

—

